# అథ పంచ చత్వారింశో%ధ్యాయః

## దూత సంవాదము - యుద్ధప్రారంభము

సనత్కుమార ఉవాచ |

గతస్తతో మత్త గజేంద్రగామీ పీత్వా సురాం ఘూర్ణితలోచనశ్చ |

మహానుభావో బహుసైన్యయుక్తః ప్రచండవీరో వరవీరయాయీ || 1

దదర్శ దైత్యస్స్మర బాణవిద్ధో గుహాం తతో వీరకరుద్ధమార్గామ్ |

స్నిగ్ధం యథా వీక్ష్య పతంగ సంజ్ఞః దశాప్రదీపం చ కృమిర్వ్యపేత్య || 2

తథా ప్రదర్శ్యాశు పునః పునశ్చ సంపీడ్యమానో%పి స వీరకేణ |

బభూవ కామాగ్ని సుదగ్ధ దేహో%ంధకో మహాదైత్యపతిస్స మూఢః || 3

పాషాణ వృక్షాశనితో యవహ్ని భుజంగ శస్త్రాస్త్రబిభీషికాభిః |

సంపీడితో% సౌ న పునః ప్రపీడ్యః పృష్టశ్చ కస్త్వం సముపాగతో%సి || 4

నిశమ్య తద్ధాం స్యమతం న తస్మై#్మ చకార యుద్ధం స తు వీరకేణ |

ముహూర్త మాశ్చర్యవదప్రమేయం సంఖ్యే జితో వీరవరేణ దైత్యః || 5

తతస్తు సంగ్రామ శిరో విధాయ క్షుత్క్షామ కంఠస్తృషితో గతో%భూత్ |

చూర్ణీకృతే ఖడ్గవరే చ ఖిన్నే పలాయమానో గత విస్మయస్సః || 6

చక్రుస్తదాజిం సహ వీరకేణ ప్రహ్లాదముఖ్యా దితిజప్రధానాః |

లజ్జాంకుశాకృష్టధియో బభూవుస్సుదారుణా శ్శస్త్ర శ##త్రైరనేకైః || 7

సనత్కుమారుడిట్లు పలికెను -

తరువాత, మదించిన ఏనుగువలె నడుచువాడు, కనుగ్రుడ్లను త్రిప్పుచున్నవాడు, మహానుభావుడు, భయంకరమగు పరాక్రమము గలవాడు, శ్రేష్ఠవీరుని నడక గలవాడు అగు అంధకుడు మద్యమును త్రాగి బయలుదేరెను (1). మిడత అనే క్రిమిదీపమును సమీపించి ప్రేమతో దానిని పరికించు విధంబున, మన్మథ బాణములచే కొట్టబడిన హృదయము గల ఆ రాక్షసుడు వీరకునిచే అడ్డుకొనబడిన దారిగల గుహను గాంచెను (2). వెంటనే వీరకు డాతనిని పలుమార్లు ముష్టిఘాతములతో పీడించెను. కాని కామము అనే అగ్నిచే దహింపబడిన దేహము గలవాడు, దానవచక్రవర్తి, మూర్ఖుడు అగు ఆ అంధకుడు ముందునకు సాగెను (3). పాషాణములు, వృక్షములు, పిడుగులు, జలము, అగ్ని, సర్పములు, ఇతర ఆయుధములు మరియు అస్త్రములతో వీరకుడాతనిని హింసించి పలుమార్లు భయపెట్టిననూ, ఆతడు వాటిని లెక్కచేయలేదు. అపుడు వీరకుడాతనిని, 'నీవెవరివి? ఏల వచ్చితివి?' అని ప్రశ్నించెను (4). ఆ మాటను విని అంధకుడు తన అభిప్రాయమును ఆతనికి చెప్పలేదు. అపుడు అంధకుడు వీరకునితో యుద్ధమును చేసెను. ఆ యుద్ధములో ముహూర్త కాలములో వీరశ్రేష్ఠుడగు వీరకుడు ఆ రాక్షసుని జయించెను. ఈ ఆశ్చర్యమును అంధకుడు అర్థము చేసుకోలేకపోయెను (5). ఈ విధముగా యుద్ధమును చేసి ఆకలి దప్పికలతో ఎండిపోయిన కంఠము గల అంధకుడు తొలగిపోయిన గర్వము గలవాడై తన శ్రేష్ఠమగు ఖడ్గము చూర్ణము కాగా పలాయనమును చిత్తగించెను (6). అపుడు వీరకునితో ప్రహ్లాదుడు మొదలగు రాక్షస శ్రేష్ఠులు యుద్ధమును చేసిరి. భయంకరులగు ఆ వీరులు అసంఖ్యాకములగు శస్త్రములచే కొట్టబడిరి. వారి అంతఃకరణములను సిగ్గు అనే అంకుశము పీడించెను (7).

విరోచనస్తత్ర చకార యుద్ధం బలిశ్చ బాణశ్చ సహస్రబాహుః |

భజిః కుజంభస్త్వథ శంబరశ్చ వృత్రాదయాశ్చాప్యథ వీర్యవంతః || 8

తే యుధ్యమానా విజితాస్సమంతాద్ద్విధాకృతా వై గణవీరకేణ |

శేషే హతానాం బహుదానవానాముక్తం జయత్యేవ హి సిద్ధసంఘైః || 9

భేరుండ జానాభినయ ప్రవృత్తే మేదో వసామాంస సుపూయమధ్యే |

క్రవ్యాద సంఘాత సమాకులే తు భయంకరే శోణితకర్దమే తు || 10

భ##గ్నైస్తు దైత్యైర్భగవాన్ పినాకీ వ్రతం మహాపాశుపతం సుఘోరమ్ |

ప్రియే మయా యత్కృత పూర్వమాసీద్దాక్షాయణీం ప్రాహ సుసాంత్వయిత్వా || 11

తస్మాద్బలం యన్మమ తత్ర్పణష్టం మర్త్యైరమర్త్యస్య యతః ప్రపాతః |

పుణ్యక్షయాహీ గ్రహ ఏవ జాతో దివానిశం దేవి తవ ప్రసంగాత్ || 12

ఉత్పాద్య దివ్యం పరమాద్భుతం తు పునర్వనం ఘోరతరం చ గత్వా |

తస్మాద్ర్వతం ఘోరతరం చరామి సునిర్భయా సుందరి వై విశోకా || 13

ఏతావదుక్త్వా వచనం మహాత్మా ఉపాద్య ఘోషం శనకైశ్చకార |

స తత్ర గత్వా వ్రతముగ్ర దీప్తో గతో వనం పుణ్యతమం సుఘోరమ్ || 14

ఆ సమయములో విరోచనుడు, బలి, బాణుడు, కార్తవీర్యుడు, భజి, కుజంభుడు, శంబరుడు మరియు పరాక్రమవంతుడగు వృత్రుడు మొదలగువారు యుద్ధమును చేసిరి (8). శివకింకరుడగు వీరకుడు

యుద్ధము చేయుచున్న ఆ దానువులనందరినీ జయించి రెండు ఖండములుగా చేసెను. అనేకమంది రాక్షసులు మరణించగా, యుద్ధము ముగిసిన పిదప సిద్ధ సంఘములు జయధ్వానములను చేసిరి (9). క్రొవ్వు, వస, మాంసము, రక్తముతో కలిసి బురదగా తయారై కుళ్లి భయంకరముగా నున్న ఆ యుద్ధరంగములో నక్కలు నాట్యమును చేసినవి. మాంసమును భక్షించే జంతువులు గుంపులుగా చేరుటచే ఆ స్థలము అల్లకల్లోలమాయెను (10). రాక్షసులీ విధముగా భంగపాటును పొందిరి. అపుడు పినాకధారియగు శివుడు దక్షపుత్రికను ఓదార్చి ఇట్లు పలికెను. ఓ ప్రియురాలా! నేను పూర్వము మిక్కిలి క్లేశముతో గూడిన ఈ మహాపాశుపత వ్రతమునాచరించి యుంటిని (11). ఓ దేవీ! దానివలన నాకు కలిగిన బలము రాత్రింబగళ్లు నీతో కలిసి విహరించుట వలన క్షీణించినది. అందువలననే, పుణ్యము క్షీణించిన కారణముగా మర్త్యుల చేతితో అమరులు పరాజయమును పొందుచున్నారు. (12). దివ్యము, అత్యాశ్చర్యకరము, మిక్కిలి భయంకరము అగు వనమును సృష్టించి మరల అచటకు వెళ్లి అప్పటికంటే ఇంకనూ ఘోరమైన వ్రతమునాచరించెదను. ఓ సుందరీ! నీవు శోకమును వీడి నిర్భయముగా నుండుము (13). మహాత్ముడు, మహాతేజస్వియగు శివుడు ఇంత మాత్రమే పలికి పరమ పవిత్రము, అతిభయంకరము అగు వనమును ప్రవేశించి తన అభిప్రాయమును బిగ్గరగా ప్రకటించి, మెల్లగా తపస్సును చేయ మొదలిడెను (14).

చర్తుం హి శక్యం తు సురాసురైర్యన్న తాదృశం వర్ష సహస్రమాత్రమ్ |

సా పార్వతీ మందరపర్వతస్థా ప్రతీక్షమాణా గమనం భవస్య || 15

పతివ్రతా శీలగుణోపపన్నా ఏకాకినీ నిత్యమథో విభీతా |

గుహాంతరే దుఃఖపరా బభూవ సంరక్షితా సా సుతవీరకేణ || 16

తతస్స దైత్యో వరదానమత్త సై#ౖర్యోధముఖ్యై స్సహితో గుహాం తామ్ |

విభిన్న ధైర్యః పునరాజగామ శిలీముఖైర్మారసముద్భవైశ్చ || 17

అత్యద్భుతం తత్ర చకార యుద్ధం హిత్వా తదా భోజనపాననిద్రాః |

రాత్రిం దివం పంచశతాని పంచ క్రుద్ధస్ససైన్యైస్సహ వీరకేణ || 18

ఖడ్గైస్సకుంతైస్సహ భిందిపాలైర్గదాభుశుండీభిరథో ప్రకాండైః |

శిలీ ముఖైరర్ధ శశీభిరుగ్రైర్వితస్తిభిః కూర్మముఖైర్జ్వలద్భిః || 19

నారాచముఖ్యైర్నిశితైశ్చ శూలైః పరశ్వధైస్తోమర ముద్గరైశ్చ |

ఖడ్గైర్గుడైః పర్వతపాదపైశ్చ దివ్యైరథాసై#్ర రసిదైత్యసంఘైః || 20

న దీధితిర్భిన్నతనుః పపాత ద్వారం గుహాయాః పిహితం సమస్తమ్ |

తైరాయుధైర్దైత్య భుజ ప్రయుక్తైర్గుహాముఖే మూర్ఛిత ఏవ పశ్చాత్ || 21

శివుడు వేయి సంవత్సరముల కాలము తపస్సును చేసెను. అట్టి తపస్సును చేయు శక్తి దేవతలకుగాని, రాక్షసులకు గాని లేదు. ఆ పార్వతి శివుని రాకకై ఎదురుచూస్తూ మందరపర్వతమునందుండెను (15). పతివ్రత, శీలముతో గుణములతో విరాజిల్లునది అగు ఆమె గుహ లోపల సర్వదా ఏకాంతములో ఉంటూ భయమును పొంది దుఃఖించెడిది. ఆమెను పుత్రుడగు వీరకుడు రక్షించెను (16). అపుడు కాముని బాణములచే గోల్పోయిన ధైర్యము గలవాడు, వరదానముచే గర్వించిన వాడునగు ఆ రాక్షసుడు శ్రేష్ఠులగు యోధులతో గూడి ఆ గుహవద్దకు మరల వచ్చెను (17). క్రోధముతో గూడియున్న ఆ అంధకుడు నిద్రను, నీటిని, ఆహారమును విడనాడి సైన్యములతో గూడిన వాడై అయిదు వందల అయిదు రాత్రులు, పగళ్లు వీరకునితో అత్యద్భుతమగు యుద్ధమును అచట చేసెను (18). ఖడ్గములు, బల్లెములు, భిందిపాలములు, గదలు, పెద్ద భుశుండులు, వాడి అర్ధచంద్రాకార బాణములు, ఇనుపకొక్కెములు గల బాణములు, మండే కూర్మాకార బాణములు (19), వాడియైన

నారాచ బాణములు, శూలములు, గొడ్డళ్లు, తోమరములు, ముద్గరములు, శిలలు, వృక్షములు మరియు దివ్యాస్త్రములు మొదలగు వాటితో రాక్షసవీరులు యుద్ధమును చేసిరి (20). ఆ రాక్షసులు ప్రయోగించిన ఆయుధములచే గుహాద్వారము పూర్తిగా మూసివేయబడి చీకట్లు అలుముకొనెను. ఆయుధములచే గాయపరచబడిన దేహముగల వీరకుడు మూర్ఛిల్లి గుహాద్వారము వద్ద ప్రక్కన పడిపోయెను (21).

ఆచ్ఛాదితం వీరకమస్త్ర జాలైర్దైత్యైశ్చ సర్వైస్తు ముహూర్త మాత్రమ్ |

అపావృతం కర్తు మశక్యమాసీన్నిరీక్ష్య దేవీ దితిజాన్ సఘోరాన్ ||
22

భ##యేన సస్మార పితామహం తు దేవీ సఖీభి స్సహితా చ విష్ణుమ్
|

సైన్యం చ మద్వీరవరస్య సర్వం సస్మారయామాస గుహాంతరస్థా ||
23

బ్రహ్మ తయా సంస్కృత మాత్ర ఏవ స్త్రీరూపధారీ భగవాంశ్చ విష్ణుః
|

ఇంద్రశ్చ సర్వైస్సహ సైన్యకైశ్చ స్త్రీరూపమాస్థాయ సమాగతాస్తే ||
24

భూత్వా స్త్రియస్తే వివిశుస్తదానీం మునీంద్ర సంఘాశ్చ మహానుభావాః |

సిద్ధాశ్చ నాగాస్త్వథ గుహ్యకాశ్చ గుహాంతరం పర్వతరాజపుత్ర్యాః ||
25

యస్మాత్సురాజ్యాసన సంస్థితానామంతః పురే సంగమనం విరుద్ధమ్
|

తతస్సహస్రాణి నితంబినీనా మనంత సంఖ్యాన్యపి దర్శయంత్యః
|| 26

రూపాణి దివ్యాని మహాద్భుతాని గౌర్యై గుహాయాం తు సవీరకార్యైః |

స్త్రియః ప్రహృష్టా గిరిరాజకన్యా గుహాంతరం పర్వతరాజపుత్ర్యాః || 27

స్త్రీభిస్సహసై#్రశ్చ శ##త్రైరనేకైర్నేదుశ్చ కల్పాంతరమేఘ ఘోషాః |

భేర్యశ్చ సంగ్రామ జయప్రదాస్తు ధ్మాంతాస్సుశంఖాస్సు నితంబినీభిః || 28

సర్వరాక్షసులు ప్రయోగించిన అస్త్ర సమూహములచే వీరకుడు కప్పివేయబడి యుండెను. మహూర్త కాలము వరకు ఆతనిని రక్షించుట సంభవము కాలేదు. అపుడా ఆ దేవి మిక్కిలి భయంకరులగు రాక్షసులను గాంచి (22) భయముతో బ్రహ్మను స్మరించెను. సఖురాంద్రతో గూడి గుహలోపల నున్న ఆ దేవి వీరులలో శ్రేష్ఠుడగు అంధకుని సైన్యమునంతనూ చూచి విష్ణువును కూడ స్మరించెను (23). ఆమె స్మరించిన వెంట బ్రహ్మ, విష్ణు భగవానుడు, ఇంద్రుడు స్త్రీ రూపములను దాల్చి సర్వసైన్యములతో గూడి అచటకు విచ్చేసిరి (24). మరియు అపుడు మహర్షుల సమూహములు, మహానుభావులగు సిద్ధులు, నాగులు, గుహ్యకులు కూడ స్త్రీ రూపములను దాల్చి పార్వతి ఉన్న గుహ లోపలకి ప్రవేశించిరి (25). చక్రవర్తి పదము నధిష్ఠించియున్న పురుషులు అంతఃపురమును ప్రవేశించుట నియమమునకు విరుద్ధము గాన, వారందరు లెక్కలేనంతమంది సుందర స్త్రీరూపములను దాల్చి లోపల ప్రవేశించిరి (26). వారు దివ్యములు, మహాద్భుతములు అగు స్త్రీ రూపములను దాల్చి ఆనందముతో వీరకార్యములను ప్రకటిస్తూ పార్వతి ఉన్న గుహలోనికి ప్రవేశించిరి (27). ఈ వేలాది మంది స్త్రీలు కల్పాంతమునందలి మేఘ గర్జనలను బోలిన నాదములను చేయుచుండిరి. ఆ సుందర స్త్రీలు సంగ్రామములో జయమును ఒసంగు భేరీలను మ్రోగించి, గొప్ప శంఖములను ఊదిరి (28).

మూర్చాం విహాయాద్భుత చండవీర్యస్స వీరకో వై పురతస్థ్సి తస్తు |

ప్రగృహ్య శస్త్రాణి మహారథానాం త్రైరేవ శ##సై#్రర్దితిజం జఘాన
|| 29

బ్రాహ్మీ తతో దండ కరా విరుద్ధా గౌరీ తదా క్రోధపరీత చేతాః |

నారాయణీ శంఖగదా సుచక్ర ధనుర్ధరా పూరిత బాహుదండా || 30

వినిర్య¸° లాంగల దండహస్తా వ్యోమాలకా కాంచనతుల్య వర్ణా |

ధారా సహస్రాకుల ముగ్రవేగం బైడౌజసీ వజ్రకరా తదానీమ్ || 31

సహస్ర నేత్రా యుధి సుస్థిరా చ సుదుర్జయా దైత్యశ##త్రైరధృష్యా
|

వైశ్వానరీ శక్తి రసౌమ్య వస్త్రా యామ్యా చ దండోద్యత పాణిరుగ్రా ||
32

సతీక్ష్ణఖడ్గోద్యతపాణిరూపా సమాయ¸° నైర్ఋుతి ఘోరచాపా |

తోయాలికా వారుణ పాశహస్తా వినిర్గతా యుద్ధమభీప్సమానా || 33

ప్రచండవాత ప్రభవా చ దేవీ క్షుధావపుస్త్వంకుశ పాణిరేవ |

కల్పాంతవహ్ని ప్రతిమాం గదాం చ పాణౌ గృహీత్వా ధనదోద్భవా చ
|| 34

యాక్షేశ్వరీ తీక్ష్ణముఖా విరూపా నఖాయుధా నాగభయంకరీ చ |

ఏతాస్తథాన్యాశ్శతశో హి దేవ్యస్సు నిర్గతా స్సంకులయుద్ధ భూమిమ్
|| 35

దృష్ట్వా చ తత్సైన్య మనంత పారం వివర్ణ వర్ణాశ్చ సువిస్మితాశ్చ |

సమాకులాస్సంచకితా భయాద్వై దైత్యా బభూవుర్వ్రదదీన సత్వాః ||
36

అద్భుతము, భయంకరము అగు పరాక్రమము గల వీరకుడు మూర్ఛనుండి తేరుకొని ఎదుట నిలబడి మహారథులు ప్రయోగించిన ఆయుధములను ప్రోగు చేసుకొని వాటితోనే ఆ రాక్షసుని కొట్టెను (29). అపుడు బ్రాహ్మి (బ్రహ్మశక్తి) చేతిలో దండమును దాల్చి రాక్షస సైన్యమునకు ఎదురుగా నిలబడెను. గౌరీదేవి యొక్క మనస్సు కోపముతో నిండిపోయెను. నారాయణి బాహుదండముల యందు శంఖ చక్రగదా ధనస్సులను ధరించి యుండెను (30). అపుడు బంగారు కాంతి కలిగిన ఇంద్రశక్తి నాగలి దండమును, వజ్రమును చేతులయందు ధరించి ముంగురులు ఆకసమునంటు చుండగా మహావేగముతో ముందుకు నడిచెను. ఆమె దాల్చిన వజ్రమునకు వేయి ధారలు ఉండెను (31). ఆ ఇంద్రశక్తి యుద్ధములో స్థిరముగా నిలబడియుండగా, అనేక దైత్యులైననూ ఆమెను జయించుటకు, కుదుపుటకు సమర్థులు కాజాలరైరి. అగ్నిశక్తి భయంకరమగు ముఖమును కలిగి యుండెను. యమశక్తి దండమును చేతిలో ఎత్తి పట్టుకొని భీతిని గొల్పెను (32). నిర్‌ఋతిశక్తి వాడి ఖడ్గమును, ఘోరమగు ధనస్సును చేతులతో సిద్ధముగా పట్టుకొని ముందునకు సాగెను. వరుణ శక్తి జల ప్రవాహశక్తి గల పాశమును చతబట్టి యుద్ధమును గోరి ముందునకు వచ్చెను (33). ప్రచండ మగు వాయుశక్తి ఆకలియే శరీరముగా గలదై చేతిలో అంకుశమును దాల్చియుండెను. కుబేరశక్తి కల్పాంతమునందలి అగ్నిని పోలియున్న గదను చేతిలో దాల్చియుండెను (34). యక్షశక్తి భయంకర వికృత ముఖము గలదై నఖములే ఆయుధములుగా కలిగియుండెను. నాగశక్తి భయంకరముగా నుండెను. వీరు మాత్రమే గాక ఇంకనూ అనేక దేవీ మూర్తులు కల్లోలితమైయున్న ఆయుద్ధ భూమికి విచ్చేసిరి (35). అంతములేని ఆ సైన్యమును గాంచి రాక్షసులు వాడిపోయిన ముఖములతో మిక్కిలి ఆశ్చర్యమును, భయమును, తొట్రుపాటును కలిగియుండిరి. వారి హృదయములలో ధైర్యము నీరుగారి, దైన్యము చోటు చేసుకొనెను (36).

చక్రస్సమాధాయ మనస్సమస్తా స్తా దేవవధ్వో విధిశక్తి ముఖ్యాః |

సుసంమతత్వేన గిరీశపుత్రా స్సేనాపతిర్వీర సుఘోరవర్యః || 37

చక్రుర్మహా యుద్ధమభూతపూర్వం నిధాయ బుద్ధౌ దితిజాః ప్రధానాః |

నివర్తనం మృత్యుమథాత్మనశ్చ నారీభిరన్యే వరదానసత్త్వాః || 38

అత్యద్భుతం తత్ర చకార యుద్ధం గౌరీ తదానీం సహితా సఖీభిః |

కృత్వా రణ చాద్భుత బుద్ధి శౌండం సేనాపతిం వీరక ఘోర వీర్యమ్ || 39

హిరణ్య నేత్రాత్మజ ఏవ భూపశ్చక్రే మహావ్యూహమరం సుకర్మా |

సంభావ్య విష్ణుం చ నిరీక్ష్య యామ్యాం సుదారుణం తద్గిలనామధేయమ్ || 40

ముఖం కరాలం విధిసేవయాస్య తస్మిన్ కృతే భగవానాజగామ |

కల్పాంత ఘోరార్క సహస్రకాంతి కీర్ణః చ వై కుపితః కృత్తివాసాః || 41

గతే తతో వర్ష సహస్రమాత్రే తమాగతం ప్రేక్ష్య మహేశ్వరం చ |

చక్రుర్మహాయుద్ధమతీవమాత్రం నార్యః ప్రహృష్టాస్సహ వీరకేణ || 42

ప్రణమ్య గౌరీ గిరిశం చ మూర్ధ్నా సందర్శయన్ భర్తురతీవ శౌర్యమ్ |

గౌరీ ప్రయుద్ధం చ చకార హృష్టా హరస్తతః పర్వతరాజపుత్రీమ్ || 43

కంఠే గృహీత్వా తు గుహాం ప్రవిష్టో రామా సహస్రాణి విసర్జితాని |

గౌరీ చ సన్మానశ##త్రైః ప్రపూజ్య గుహాముఖే వీరకమేవ స్థాపయన్ || 44

బ్రహ్మాణి మొదలగు ఆ దేవశక్తులు, మరియు భయంకరమగు పరాక్రమము గల సేనాపతియగు వీరకుడు కలిసి పార్వతికి చక్కగా నచ్చజెప్పి, ఆమె మనస్సును సమాధాన పరిచిరి (37). వరదానముచే పొందబడిన శక్తి గల ఇతర రాక్షస ప్రధానులు తమ పలాయనమును మరియు మృత్యువును గూర్చి మనస్సులో ఆలోచించుకొని ఆ స్త్రీలతో కనీ వినీ ఎరుగని మహాయుద్ధమును చేసిరి (38). అపుడు గౌరీ మహాబుద్ధిశాలి, ఘోరమగు పరాక్రమము గలవాడు అగు వీరకుని యుద్ధమునకు సేనాపతిని చేసి సఖురాండ్రతో గూడి అచట అత్యద్భుతమగు యుద్ధమును చేసెను (39). హిరణ్యాక్షుని కుమారుడు, రణకుశలుడు అగు అంధక మహారాజు విష్ణువును గాంచి దక్షిణ దిక్కువైపునకు చూచి భయంకరుడగు గిలుడు అనుపేరు గల వానిని సేనాపతిని చేసి శీఘ్రముగా గొప్ప వ్యూహమును రచించెను (40). ఆతడు సేనాముఖమును యథా న్యాయముగా రచించి భయంకరముగా తీర్చి దిద్దునంతలో ప్రళయకాలమునందలి వేయి భయంకర సూర్యుల కాంతి గలవాడు, చర్మను ధరించినవాడు అగు శివభగవానుడు కోపముతో అచటకు విచ్చేసెను (41). వేయి సంవత్సరముల తరువాత తిరిగి వచ్చిన ఆ మహేశ్వరుని గాంచి స్త్రీలు మహానందమును పొంది వీరకునితో గూడి మహాయుద్ధమును చేసిరి (42). గౌరీదేవి కైలాసపతికి శిరసువంచి ప్రణమిల్లెను. ఆమె భర్త యెదుట తన గొప్ప పరాక్రమమును చూపుతూ ఆనందముతో మహాయుద్ధమును చేసెను. అపుడు శివుడు పార్వతిని కౌగిలించుకొని (43). గుహలో ప్రవేశించెను. అచట ఉన్న వేలాదిమంది స్త్రీలను బయటకు పంపిరి. గౌరి వారిని వివిధ సన్మానములతో సత్కరించెను. గుహాద్వారము వద్ద మరల వీరకుడే స్థాపించబడెను (44).

తతో న గౌరీం గిరిశం చ దృష్ట్వా%సురేశ్వరో నీతి విచక్షణో హి |

ద్రుతం స్వదూతం విఘసాఖ్యమేవ స ప్రేషయామాస శివోపకంఠమ్ || 45

త్రైసై#ః ప్రహారైరపి జర్జరాంగస్తస్మిన్ రణ   దేవగణ   రితైర్యః |

జగాద వాక్యం తు సగర్వముగ్రం ప్రవిశ్య శంభుం ప్రణిపత్య మూర్ధ్నా || 46

తరువాత నీతి విశారదుడగు ఆ రాక్షసేశ్వరుడు పార్వతీపరమేశ్వరులను గనజాలక వెంటనే విఘసుడను వానిని తన దూతగా శివుని వద్దకు పంపెను (45). దేవతలు, శివగణములు ఆ యుద్ధములో ప్రయోగించిన ఆయా ఆయుధముల దెబ్బలచే శిథిలమైన అవయవములు గల ఆ దూత శంభుని వద్దకు వచ్చి శిరస్సుతో ప్రణమిల్లి గర్వముతో పరుషమగు ఈ మాటను పలికెను (46).

సంప్రేషితో%హం వివిశే గుహాం తు హ్యేషో%ంధకస్త్వాం సమువాచ వాక్యమ్ |

నార్యా న కార్యం తవ కించిదస్తి విముంచ నారీం తరుణీం సురూపామ్ || 47

ప్రాయో భవాంస్తాపసస్తజ్జుషస్వ క్షాంతం మయా యత్కమనీయమంతః |

మునిర్విరోధవ్య ఇతి ప్రచింత్య న త్వం మునిస్తాపస కిం తు శత్రుః || 48

అతీవ దైత్యేషు మహావిరోధీ యుధ్యస్వ వేగేన మయా ప్రమథ్య |

నయామి పాతాల తలానురూపం యమక్షయం తాపస ధూర్త హి త్వామ్ || 49

దూత ఇట్లు పలికెను-

అంధకుడు పంపగా నేనీ గుహలోప్రవేశించితిని. అంధకుడు నీతో ఇట్లు చెప్పుచున్నాడు. నీకు స్త్రీతో ప్రయోజమేమియూ లేదు. కావున యువతి, సుందరి అగు ఈ స్త్రీని విడిచిపెట్టుము (47). నీవు అధికకాలము తపస్సును చేయుచుందువు. అటులనే కొనసాగించుము. మునితో విరోధమేల? అని ఆలోచించి నేను హృదయములో మధురమగు క్షమాగుణమును స్వీకరించితిని. ఓ

తపస్వీ! కాని నీవు మునివి కావు. నాకు శత్రుడవైనావు (48). నీవు రాక్షసులతో పెద్ద విరోధమును చేబట్టితివి. నీ బలమును చూపి నాతో వేగముగా యుద్ధమును చేయుము. ఓరీ దుష్టమునీ! నిన్ను నేను పాతాళ దేశమునకు తగియున్న యమపురికి పంపించెదను (49).

సనత్కుమార ఉవాచ|

ఏతద్వచో దూత ముఖాన్నిశమ్య కపాలమాలీ తమువాచ కోపాత్ |

జ్వలన్ విషాదేన మహాంస్త్రి నేత్రస్సతాం గతిర్దుష్టమదప్రహర్తా || 50

సనత్కుమారుడిట్లు పలికెను -

కపాలముల మాలను ధరించినవాడు, విరాట్ స్వరూపుడు, సత్పురుషులకు శరణు, దుష్టుల గర్వమునడంచువాడు అగు ఆ ముక్కంటి దూత పలికిన ఆ పలుకులను విని దుఃఖముతో మరియు కోపముతో మండిపడుతూ ఆతనితో నిట్లనెను (50).

శివ ఉవాచ |

వ్యక్తం వచస్తే తదతీవ చోగ్రం ప్రోక్తం హి తత్త్వం త్వరితం ప్రయాహి |

కురుష్వ యుద్ధం హి మయా ప్రసహ్య యది ప్రశక్తో%సి బలేన హి త్వమ్|| 51

యస్త్వ్యదశక్తో భువి తస్య కో%ర్థో దారైర్ధనైర్వా సుమనోహరైశ్చ |

ఆయాంతు దైత్యాశ్చ బలేన మత్తా విచార్యమేవం తు కృతం మయైతత్ || 52

శరీరయాత్రాపి కుతస్త్వశ##క్తేః కుర్వంతు యద్వ్యద్విహితం తు తేషామ్ |

మయాపి యద్యత్కరణీయమస్తి తత్తత్కరిష్యామి న సంశయో%త్ర || 53

శివుడిట్లు పలికెను -

నీ పలుకులు మిక్కిలి పరుషముగా నున్నవని స్పష్టమే. అయిననూ నీవు ఒక విషయములో సత్యమునే పలికితివి. నీవు శక్తి గలవాడైనచో, సైన్యముతో గూడి వచ్చి నాతో యుద్ధమును చేయుము (51). లోకములో బలహీనునకు మిక్కిలి సుందరియగు భార్యతోగాని, సంపదలతోగాని ప్రయోజనమేమి గలదు? బలముచే గర్వించిన రాక్షసులు యుద్ధమునకు వచ్చెదరుగాక ! నేను ఆలోచించి ఇట్లు చేయుటకు నిర్ణయించితిని (52). శక్తి లేనివానికి దేహయాత్రాయైననూ గడవదు. వారికి ఏదిచేయ దగిన కర్మయో, దానిని వారు ఆచరించెదరు గాక! నాకు గల కర్తవ్యముల నన్నిటినీ నేను అనుష్ఠించెదను. దీని విషయములో సందేహము లేదు (53).

సనత్కుమార ఉవాచ |

ఏతద్వచస్తద్విఘసో%పి తస్మాచ్ఛ్రుత్వా హరాన్నిర్గత ఏవ హృష్టః |

ప్రాగాత్తతో గర్జితహుం కృతాని కుర్వంస్తతో దైత్యపతేస్సకాశమ్ || 54

ఇతి శ్రీ శివమహాపురాణ  రుద్ర సంహితాయాం యుద్ధఖండే యుద్ధ ప్రారంభ దూత సంవాద వర్ణనం నామ పంచ చత్వారింశో%ధ్యాయః (45).

సనత్కుమారుడిట్లు పలికెను-

విఘసుడు ఆ శివుని ఈ వచనములను విని ఆనందముతో బయటకు వచ్చెను. అపుడాతడు గర్జనలను, హుంకారములను చేయుచూ రాక్షసరాజు వద్దకు వెళ్లెను (54).

శ్రీ శివ మహాపురాణములోని రుద్ర సంహితయందు యుద్ధఖండలో యుద్ధ ప్రారంభ దూతసంవాద వర్ణనమనే నలుబది అయిదవ అధ్యాయము ముగిసినది (45).